240
1936




ఓమ్.

శ్రీసద్గణపతయేనమః



జమ్ములమడక

# శ్రీ ఆంజనేయశతకము.



రచయితలు

బ్రహ్మశ్రీ కన్నాకంటి వీరభద్రాచార్యులు.

(పలునాటి సోదరకవులు)

ప్రకాశకులు

— పల్నాడుతాలూకా జమ్ములమడక శాస్త్ర్యులు —

నర్సారావుపేట శార్వాణి ప్రెస్‌యందు

ముద్రితము,

ఓమ్.

శ్రీమద్గణపతయేనమః

జమ్ములమడక

# శ్రీ ఆంజనేయశతకము.

రచయితలు

బ్రహ్మశ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు.

(పలునాటి సోదరకవులు)

ప్రకాశకులు

—♦ పల్నాడుతాలూకా జమ్ములమడక వాస్తవ్యులు ♦—

ప్రథమముద్రణము 500 ప్రతులు.

# స్వ వి ష య ము.



సీ॥ భాగీరథీసమ ♦ ప్రగీయమానమా
నాగాస్రవంతి ప్ర ♦ శస్థమాకు
భువన రక్షకుడు వే ♦ ములవాడ రాజేశ్వ
రుండ భీష్టఫల ప్ర ♦ దుండుమాకు
కవులు ప్రార్థితశివా ♦ ధవులు కొండాన్వయో
ద్భవులు మాతా మహో ♦ ద్భవులుమాకు
కోలాన్వయక్షీర ♦ కూపార రాకాబ్జు
డైన కేశవరెడ్డి ♦ యండమాకు

గీ॥ తత్వశిల్ప కవిత్వగాం ♦ ధర్వ కళలు
తరతరంబుల నిజ గృహా ♦ స్థములుమాకు
క్షితిగళాభరణంబు తె ♦ క్కెళ్ళపాటి
నామకగ్రామమగు జన్మ ♦ భూమిమాకు.





# ప్రార్థనాదికము.

——:o:——

కం॥ శ్రీసర్వమంగళాంగుఁడు
దాసజనావనుఁడు శుభద ♦ తత్త్వుఁడు భక్త్యు
ల్లాసుఁడు వేములవాఁడ ని
వాసుఁడు రాజేశ్వరుండు ♦ వరలుమదాత్మన్.

సీ॥ బ్రహ్మాదిసురలు వి ♦ పన్నివారకహరీ
కృష్ణా! మహాత్మా! ర ♦ క్షించుమనఁగ
వామపార్శ్వాసీన ♦ యై మహాభక్తిచే
పద్మాలయాదేవి ♦ ప్రస్తుతింప
పాదాబ్జములమీఁద ♦ బడి ఱెక్కలను లేపి
తార్క్ష్యవాహనము నం ♦ దనముజలుప
శేషాగ్రిమందున ♦ శృంగారమొప్పార
సటునిటుపించ మ ♦ ల్లాడుచుండ

గీ॥ శంఖ చక్రద్వయంబు హ ♦ స్తములమెరయ
కంఠమందున వనమాల ♦ గ్రాలుచుండ
నీలదేహత వైకుంఠ ♦ నిలయుఁడైన
శ్రీమహావిష్ణువెపుడు పో ♦ షించుగాత.

గీ॥ జీవులనుతోలుబొమ్మలఁ జేసివారి
సుకృతదుష్కృతములనెల్లఁ ♦ జూచిపాల
ముల లిఖించి జగమువృద్ధిఁ ♦ జలుపుపట్టి
విధిదయామతి నన్నుదీ ♦ వించుగాత.

కం॥ మతియింతుఁ భక్తి శ్రీగణ
పతినాకార్యములు చక్క ♦ పడఁదదుపరి పా
ర్వతినిన్ భార్గవిని సర
స్వతి నిన్ ప్రార్థింతు నాకు ♦ సంతసమునిడన్.

గీ॥ జనకుడిడు నాజ్ఞఁ దనదు శీ ♦ ర్షమున దాల్చి
తమ్ముఁడౌ లక్ష్మణునితోడ ♦ తరుణితోడ
విపినమున జేరి యవతార ♦ విధినిదీర్చు
రామచంద్రుడు నను మహా ♦ ప్రేమ జూచు.

గీ॥ పండితగ్రామణుల్ బుధుల్ ♦ భవపదాబ్జ
బంధురులు దివ్యవేదాంత ♦ భావులైన
కొండ శంకర కవిని ♦ గురుఁడుమల్లె
మత్తుయాచార్యనా హృద ♦ యమున దలతు.

గీ॥ ఆర్య చేతనభట్ల వం ♦ శాబ్ధివిధుని
సర్వశాస్త్రజ్ఞు శాంతు కృ ♦ ష్ణకవి నెంతు
నక్కిరాడ్వంశ సంజాతు ♦ సమలమూర్తి
వేంకయాభిఖ్యమనమున ♦ వినుతి జేతు.

సీ॥ ఘనుఁడైన కొండ శం ♦ కరపండితునియొద్ద
విద్య సాధించిన ♦ విమలశీల
తత్పండితుని కవి ♦ తారసంబును దెచ్చి
పుత్రత్రయమునకు ♦ బోయు సాధ్వి
తమ్ములు మువ్వురు ♦ తనయొద్ద కలుదెంచ
దీవించుచుండెడి ♦ దివ్యహృదయ
వినువారలను గాంచి ♦ వినయంబు దోపగ
ధర్మముల్ దెల్పు ♦ కాంతాలలామ
గీ॥ తనకు హితవౌ సువాసినీ ♦ త్వమున గౌరిఁ
జేరబోయిన సద్యశ ♦ శ్విని మదంబ
సుతుని నే జేయు శతకముఁ ♦ జూచుగాక
కుధరజాంఘ్ర్యబ్జరోలంబ ♦ కోటమాంబ.

— గ్రంథకర్త.



ఓం.

శ్రీఆంజనేయపరబ్రహ్మణేనమః.

# శ్రీ ఆంజనేయశతకము.

శా॥ శ్రీరాముండు మహానుభావుఁడు కృపా ♦ సింధుండు తాఁజానకీ
నారీరత్నముఁ గూడి సంతతము హృ ♦ న్నాళీకమందుండి దో
స్సారంబున్ విమలాత్మయు న్నొసఁగ ర ♦ క్షన్నేయు నీభక్తియే
మారా జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 1

శా॥ సీతత్త్వమ్మును నీమహామహిమనీ ♦ నిర్మాల్యపుంభక్తి నీ
నీతిన్ నీరణకోవిదత్వమును వ ♦ ర్ణింపంగలో నెంచి నే
చేతన్వ్రాసితి నీకలంబును యశ ♦ శ్శ్రీ! సాధ్యమో కాదొ వి
ఖ్యాతా! జమ్ములమడ్క- పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 2

మ॥ మతిహీనుండను నీకు భక్తుఁడను న ♦ న్మన్నించుమా నాథ న
వ్రతతిన్నార్బరఁగఁదోలుమాయనుచు నీ ♦ పైఁబద్యముల్గూర్తు నే
శతముల్ నీకరుణావిశేషములతో సా ♦ కస్గదే దేవ! శా
శ్వత! శ్రీజమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 3

మ॥ స్థిరచిత్తుండను గాదు నిన్ సతతము ♦ న్సేవింపనైశ్వర్యసం
భరితుండన్ మతికాదు నీకుఁ గుసుమ ♦ న్నాభ్రికారముల్గట్ట న
న్బరిరక్షింపఁగ నూఁతకేయగున యీ ♦ పద్యాలఁగొమ్మా కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 4

మ॥ అకలంకాత్ముఁడు రాజయాఖ్యునకు ది ♦ వ్యస్వాంతశ్రీకోటమాం
బకుఁ బుత్రుండను మల్లికార్జునసరున్ ♦ భవ్యాత్మ భాగీరథాం
బకుఁ బౌత్త్రుండను కన్నికంటికులుఁడన్ ♦ 'మాంపాహి మాంపాహి' ర
క్షక శ్రీజమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 5

మ॥ అమలాత్ముండవు నీవు సచ్చరితవిద్యా ♦ హా! బ్రహ్మచర్యవ్రతం
బుమహాకష్టము సేసితంతవలెఁ గాక ♦ పూర్ణాంగ్ల చేఁజిక్కఁగో
కమహాభాగ యుకేస్తునే నీ తలుకం ♦ గాంజేయు మాన్యా వివా
హము శ్రీజమ్ములమడ్క-పూర్ధ్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 6

శా॥ ఏకాగ్ర్యంబులఁ జేయఁగా వినను ని ♦ న్నేకాంతమౌ భక్తితో
నీకర్పించిన మాత్రనే కడలి నె ♦ న్నాఁడేని ప్రవేశించి యా
యాకార్యంబుల నాఁగఁ జేతువట దీ ♦ వ్యద్రూపముతోఁ జూమటన్
గాఁకే జమ్ములమడ్క- పూర్ణిలయుఁడ ♦ హా! ఆంజనేయప్రభూ! 7

శా॥ నీవే తల్లివి నీవె తండ్రివి ప్రభూ ♦ నీవే స్వామి గురుండవౌ
నీవే మోక్షపురీప్రదర్శకుఁడవై ♦ వేదాదిశాస్త్రజ్ఞుఁడ వౌ
దీవే నిస్తులనామశక్తి యెకదా ♦ దే! నన్ను రక్షింపఁగా
రావా జమ్ములమడ్క-పూర్ధ్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥

మ॥ అనయంబున్ భవదీయసంస్మరణ జే ♦ యన్ గోరు భక్తాళిపై
ఘనమౌ నీకృపనుంచి ప్రోవఁగను చే ♦ ఖడ్గంబుఁ బూల్చి వా
రి నిరక్షించుచు శత్రులన్ దునిమి సు ♦ శ్రీఁగూర్తు వెల్లప్పుడో
యనఘా జమ్ములమడ్క-పూర్ధ్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ! 9

శా॥ ఓతండ్రీ! సకలప్రపంచమున ని ♦ ర్వాణప్రశస్త్యుండవై
జ్ఞాతత్వంబున కందకుండెదవు నీ ♦ సామాన్యమే కీర్తిదో
నీతత్త్వమ్మెటువంటిదో తెలియన ♦ క్షింపంగ శక్యంబె వి
ఖ్యాతా! జమ్ములమడ్క-పూర్ధ్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 10

మ॥ శివవీర్యంబున నంజనా సుదతికిన్ ♦ శ్రీ మీరఁగా వేడ్కను
ద్భవమై బాల్యము నందసూర్యుని ఫల ♦ భ్రాంతిన్ విలోకించి నాఁ
డవు నీరూపముఁ గాంచినంత నె యజాం ♦ డంబెల్ల భీతిల్లవె
భవ! శ్రీజమ్ములమడ్క-పూర్ణిలయ దే ♦ వా ఆంజనేయప్రభూ! 11

మ॥ తనువుఁ దాలిచి తల్లిగర్భమున నా♦ స్తప్యంబు నైయుండ స
న్మున నే ధీరుఁడు విశ్వకర్మభగనా ♦ నుండి మ్ము కీనముఁ
గని దాంకఁ ధరియించి వెల్లితివి శ్రీ ♦ గారాపు రూపంబుతో
ఘనఘూర జమ్ములమడ్క పూర్వగవిహా ♦ రా ఆంజనేయప్రభూ! 12

మ॥ హారముఖ్యుల్ గనుచుండ నప్పుడు నా ♦ ట్యాభాషగా కిన్నరే
శ్వరయక్షప్రముఖుల్ మొదలుగ ము ♦ ధ్యానాబుంగఁ జల్ప భీ
కర రూపంబున పుట్టికంచుకముతో ♦ శ్రీ నొప్పెంచి తో
స్థిర! శ్రీజమ్ములమడ్క మందిర యశ ♦ శ్రీ! ఆంజనేయప్రభూ! 13

మ॥ ఉదయాస్తాద్రులపైన నిశ్చలత ది ♦ వ్యోర్దీకతఁ వే భవ
త్పదయుగ్మంబు మనిష్ఠమిత్తు గురు గా ♦ భావించి శాస్త్రంబులఁ
జదువఁ గల్గితి వేమిసీను హేమ వి ♦ శ్వస్తుత్య పాదా! శుభ
ప్రద! శ్రీజమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 14

శా॥ ఏయే జన్మములఁ ధరించితినో నే ♦ నే పాపముల్ చేసి నా
నోయీ నాటికి తల్లి లేకుండిక రెం ♦ తో కష్టముల్ గల్గె నా
న్యాయాన్యాయములన్ గ్రహించగదవ ♦ న్నానన్ని యున్నానుస
ద్గేయ! జమ్ములమడ్క మందిరకృపా ♦ బ్ధీ ఆంజనేయప్రభూ! 15

మ॥ సరిగా వేల్పులు లేని వారు ఘనవ ♦ ర్ణంబుండిన పంపకే
ధరపై నిల్చిన పైరు మృణ్మయముగా ♦ దంభహ్యమా నిరుని
స్మరణన్ జేయని నోరు సజ్జనులకున్ ♦ సంతోషముఁ గూర్చునే
ధరలో జమ్ములమడ్క వాసహితమో ♦ దా ఆంజనేయప్రభూ! 16

మ॥ సరిగా లేవని బంతి యుద్ధధరణిఁ ♦ జాకాడుచో దంతి యు
క్కరిఁ నేర్వని శాంతి కానిదగు ♦ శుష్క బ్రాంతి యాహాపమో
ధరముల్ గల్గని యింతి నిన్నరయకే ♦ దాందాల్చు సత్కాంతి సం
కరముల్ జమ్ములమడ్క పూర్ణిలయరమా ♦ ఆంజనేయప్రభూ! 17

మ॥ అసిలోఁ జూపనియట్టి భీమము సద ♦ బ్జాతుల్ మదిన్ గోరు వే
శనుచూపింపక యున్నకామము మహా ♦ హ్లాదంబుతో నిచ్చు గో
ల్వని యానీయము లాభముండునొకొ దే ♦ వా భక్త కల్పద్రుమా
అనఘా జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ! 18

మ॥ సభలన్ లేవని నోళ్ళు యాత్రలుగనన్ ♦ సంచారమున్ జేయకే
విభవంబుంబెను కాళ్లు కష్టనిడకే ♦ వేయించుపందిళ్ళు స
ద్విభునిన్నిల్పనిగుళ్ళు గాభమెకృపా ♦ బ్ధీ వ్యర్థముల్ సూర్య స
న్నిభ శ్రీ జమ్ములమడ్క పూర్ణిలయతం ♦ ద్రీ ఆంజనేయప్రభూ! 19

మ॥ మధురంబౌనని పండ్లు చుట్టములురా ♦ మర్యాదలేనిండ్లు వా
క్సుధలన్ జిమ్మకయున్న నోండ్లపువులన్ ♦ గోయంగలేనట్టి వేం
డ్లుధరన్ గొల్వని చేతుజోండ్లుతలుపన్ ♦ లోకంబునన్ వ్యర్థముల్
విధిగా జమ్ములమడ్క మందిరయశ ♦ శ్రీ ఆంజనేయప్రభూ! 20

మ॥ సరుకుల్ గల్గకయున్న కొట్లు విగత ♦ త్మాజంబునౌగట్లు సా
దరమున్ లేనటువంటి పెట్టుపలుకుల్ ♦ దీప్వించనౌ శెట్టునిన్
స్థిరతన్ నిల్పనినట్టు మాండగయశశ్రీ వ్యర్థముల్ గాదయా
కర శ్రీజమ్ములమడ్క వాస ♦ నతరక్షా ఆంజనేయప్రభూ! 21

మ॥ పదునున్ దాల్పని కత్తిముట్టినను ♦ దహంబుండనౌవత్తి పెం
పొదవన్ జాలని నెత్తి మోదపడగా ♦ నూదివ్వనౌతిత్తిని
న్మదిలో నిల్పని బత్తి చూడగ మహా ♦ త్మా వ్యర్థముల్ వ్యర్థముల్
గద శ్రీజమ్ములమడ్క పూర్ణిలయరక్షా ♦ ఆంజనేయప్రభూ॥ 21

మ॥ బరువున్ సైచసి బండ్లు నందమిడనౌ ♦ పాలిండ్లు నేవేళన
క్కఱకున్ మాలినయిండ్లు పారులు చెడన్ ♦ గాన్పించు వాకిండ్లుని
స్సరయన్ జాలనికండ్లు వ్యర్ధములు గా ♦ వా రామభక్తా! కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క మందిర నివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 22

మ॥ ఆరోగ్యంబిడనట్టి తావి జనమ ♦ త్యానందమున్ జెందగా
నీరంబు డవిబాపి కెంపుకళ యెం ♦ తే లేని కెమ్మోవియా
చారంబూనవి శైవి నిన్దలుపనౌ ♦ ఘండాలునిన్ తావి యా
వేరే జమ్ములమడ్క మందిర! యశ ♦ శ్వీ! ఆంజనేయప్రభూ! 24

మ॥ కలుకుల్గల్గిన బాట వేగసుస్థితినై ♦ క్యంబాదనౌ పాటయు
కడ్కకున్ వ్రాలిస డబ్బుమూట జనమా ♦ కాంక్షింపనౌ మూటనీ
స్మరణజ్ఞేయునిపూటవ్యర్థము కపీ ♦ శా! రామభక్తా! కృపా
కర! శ్రీ జమ్ములమడ్క వాస! సతత ♦ తూ! ఆంజనేయప్రభూ! 25

మ॥ పరులన్నిల్వనికోట పుష్పఫలముల్ ♦ భాసిల్లనౌ తోట సం
బరముల్గల్గనిమూట హేమ్మతకుగుల్ ♦ వర్ణింపనౌ కాటనిన్
స్థిరతన్ నిల్వనిపేట వ్యర్థముయశ ♦ శ్వీ! వాయుపుత్రా! పరా
త్పర! శ్రీ జమ్ములమడ్క మందిర! మహా ♦ త్మా! ఆంజనేయప్రభూ! 26

మ॥ సమయంబందున లేనిమైత్రి పతితో ♦ సంభాషణల్ లేక తం
త్రిముతో నుండెడి దివ్యగాత్రిగత జ్యో ♦ త్స్నసూత్రవహా గ్రీనీ
మముతోఁ బెట్టనిపత్రి యొందుకు మహా ♦ త్మా! లాభమే లేకవ్య
ర్థములౌ జమ్ములమడ్క పూర్ణ్యరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 27

మ॥ బలముల్ గల్గకయున్న కండయడవిన్ ♦ భాసిల్లుకే యొండ ని
శ్చలతన్ బ్రబలి తండ తావియనపీ ♦ సంబుంధపుప్రాదండ ని
న్నిలుపజ్ఞాలనియండ మోదమిడుచున్నే ♦ దేవ! పాపాటవీ
జ్వలనా! జమ్ములమడ్క వాస సతత ♦ తూ! ఆంజనేయప్రభూ! 28

శా॥ ఏకార్యంబులఁ జేయఁ భూమిపయికీ ♦ వే తెంచియున్నాఁడవో?
యాకార్యంబులఁ దీర్ప నీహృదయం ♦ దాలోచనజ్లేసి దే
వా కిష్కింధకుఁ జేరి వానరుఁడవై ♦ వర్తించితౌ చిత్రమా
నా కో జమ్ములమడ్క పూర్ణిలయ అ ♦ న్నా! ఆంజనేయప్రభూ! 29

శా॥ నీరూపంబును నీమహామహిమను ♦ న్వీక్షించి సంతోషమే
పారన్వాలియు సూర్యపుత్రుఁడమలా ♦ ప్తా! "రమ్మురమ్మం"చుని
న్జేరన్టీసిరి యుండమాకనుచు తం ♦ డ్రి! రామభక్తా! సదా
చారా! జమ్ములమడ్క-మందిరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 30

మ॥ ఎదియోవిద్య గ్రహించుమాత్రమున మా ♦ కీరేఁడులోకాలలో
నెనరెవ్వారలటంచుఁ బల్కెదురు తం ♦ డ్రికొందరజ్ఞాను ల
య్యాది నీమానసమందుఁగానఁబడద ♦ య్యా! చిత్రమూహా? శుభ
ప్రద! శ్రీజమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 31

శా॥ కీశాధ్యక్షుఁడు వాలి తమ్ముఁడగు సు ♦ గ్రీవుణ్మహాక్రోధుఁడై
తా శక్తిన్ విదళించి కొట్టితరుమన్ ♦ ధర్మంబువీక్షించి యా
యాశన్వేడి ప్రభాకరాత్మజునితో ♦ నద్రిన్ బ్రవేశించితో
యీశా! జమ్ములమడ్క-మందిర! కృపా ♦ బ్ధీ! ఆంజనేయప్రభూ! 32

శా॥ సీతన్నాచక లక్ష్మణానుజునితో ♦ శ్రీరామచంద్రుండుని
ర్ఘాతారణ్యములన్ గలంచుచునురా ♦ గా రుశ్యమూకాద్రికిన్
చేఁతోమోదముతోఁడ వారిపదముల్ ♦ సేవించితౌభక్తివి
ఖ్యాతా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 33

శా॥ వాలిజ్జంపగ రామచంద్రునిమహా ♦ భక్తిన్విలోకించి భూ
పాలా! యాజ్ఞయునంగ ముద్రికనిడన్ ♦ వారాన్నిధిన్ దాటినీ
వాలంకాపురి యొడ్డుజేరితివిగా ♦ దాదేవ! పాపాటవీ
జ్వాలా జమ్మలమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ! 34

మ॥ సురలెల్లన్భవదీయశక్తిమహిమ న్జూడంగలోనెంచి వే
సురసన్పంపగ యామెవచ్చినిలువన్ ♦ శూరత్వమున్ జూఁపుచున్
చిరుఁతాకారమునూని నోటఁజొరి వి ♦ చ్ఛేదంబుగాఁజేయు భీ
కరశ్రీ జమ్మలమడ్క-పూర్ణిలయర ♦ త్నా! ఆంజనేయప్రభూ॥ 35

మ॥ అలలంకాపురిఁ జేరుమార్గమున ఘో♦రాకారయుతాలంక తా
నిలువన్ లెమ్మని చెప్ప ఖడ్గమున ని♦న్నే కొట్టుదునూహింప ను
జ్వలశౌర్యంబున గుద్ది వేఁడవిడిపో♦వన్ జూచి తేయో భవ
జ్వలనా! జమ్ములమడక-పూర్వరనివా♦సా! ఆంజనేయప్రభూ। 36

మ॥ ధరణీజాతనుఁ జూతునంచు కడుమో♦దంబందుచున్ లేచి మం
దిరముల్ వీధులు స దుర్గంబులును నె♦తేమూచియాంజానకీ
తరుణీరత్నము గానరామి మదిఖే♦దంబూనినావో శుభ
స్కర! శ్రీజమ్ములమడక- పూర్వరనివా♦సా! ఆంజనేయప్రభూ॥ 37

మ॥ అలుకన్దాలిచి లేఁచి పైకెగసి సూ♦క్ష్మాకార! యంతఃపురం
బులలోఁ జూఁచుచు భర్తలగ్గలియునా♦ పూబోండ్లవీక్షించి "హా"
కలుషంబాచుఁదలంచి యెట్లులగునీ♦ కార్యంబటంచెంచి చిం
తిలితే! జమ్ములమడక-మందిర! కృపా♦బ్ధీ! యాంజనేయప్రభూ॥38

మ॥ మదిలోఁ గుటిలనుఁ బూని చూడఁగదరా♦మా! పాపమెల్లాను నే
నిదియేపోయెదనంచు లేఁచి యచట♦న్వీక్షించి పైకేగి చూ
చి దశాశ్యుండుఁ బరుండు చోటుఁగని మా♦సీతమ్మయంచెంచితే
మదిలో జమ్ములమడక-మందిర! మహా♦త్మా! ఆంజనేయప్రభూ!39

మ॥ పొరపాటందితి మందబుద్ధినయి వహా♦ పూబోణిసీతమ్మ యీ
దురహంకారుని సాధ్వసానెయని♦ యెంతోదీనతన్ జూచి వా
హ్వారె మండోదరి యంచుమోదపడినా♦వా? చిత్రమయ్యా! కపీ
శ్వర! శ్రీజమ్ములమడక-మందిర నివా♦సా! ఆంజనేయప్రభూ! 40

మ॥ ఇకమాసీతమ నెందుఁగందునని కా♦నీయంచు వేలేచి పా
యకనుద్యానవనంబులన్ దిరిగి య♦మ్మా! కానగారమ్ము నీ
వకటా యెందుననుంటివంచు వడిగాఁ♦ బ్రార్థించినావయ్యా! ర
క్షక! శ్రీజమ్ములమడక-పూర్వర నివా♦సా! ఆంజనేయప్రభూ!41

మ॥ ఒకవృక్షంబునఁ గూరుచుండి కనియో ♦ హా తెల్లవారెన్నదా
యిఁక నెట్లంచు రఘూద్వహుండలచి తం ♦ డ్రియంచువీక్షించ నా
యకలంకాత్ముని దేవి కన్పడఁగ నా ♦ హ్లాదుండవైనావు ర
క్షక! శ్రీజమ్మలమడ్క మందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 42

మ॥ అకటా శుష్కశరీరయ్యెదిగులుతో హా ♦ "రామ హారామ" నా
యక! నిన్నెప్పుడు జూతునోయనెడి యా ♦ యమ్మన్ విలోకించి సి
యకళంకంబగు ప్రేమఁ జూపితివి గా ♦ దా వందనంబంచు ర
క్షక! శ్రీజమ్మలమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 43

శా॥ ఆపై రావణుఁడేగుదెంచి కసి కాం ♦ తా! నన్నుఁ బెండ్లాడుమా
నీపైఁ బ్రీతి జనించె నన్నవినియా ♦ నీ రేజపత్రాక్షి ఛీ
ఛీ పో పొమ్మన నాలకించితివి యుస్సీ ♦ యంచు చింతించి యో
ప్రాపా! జమ్మలమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 44

మ॥ సమయంబెప్పుడు వచ్చు నీకుమతినిన్ ♦ జక్కాడగానంచు రా
ద్రిముతోఁ జూచుచు రావణుండు వెడలన్ ♦ రామాయణంబెల్ల భూ
జము పైనుండి సుసాధ్వి జానకి వినన్ ♦ సాంగంబుగా దెల్పితో
విమలా! జమ్మలమడ్క మందిర యశశ్వీ ♦ ఆంజనేయప్రభూ॥ 45

శా॥ సీతన్ జూడఁగ చెట్టుడిగ్గి జననీ! ♦ శ్రీరాముబంటున్ మహా
భీతిన్ జెందెదు రామమూర్తిపనుపన్ ♦ వీక్షించగావచ్చి నే
నేతీరోకనుఁగొంటి చూడుమికయి ♦ ద్దేయూనవాలన్న వి
ఖ్యాతా! జమ్మలమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 46

మ॥ కనిసీతామణి యూనవాలునకటా ♦ కన్నీరుమున్నీరుగాఁ
గను చింతించి కపీశ రాఘవులకున్ ♦ గళ్యాణమేయన్న యా
వనితన్ దుఃఖముపీడ జేసి పతియా వ ♦ ద్వృత్తమున్ దెల్పితో
యనఘా జమ్మలమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 47

మ॥ భయమున్జెందకుమమ్మ! రాఘవుఁడు శుం ♦ భత్ప్రౌఢితోవచ్చి ది
గ్జయుఁడై రావణునిన్ వధించి విమల ♦ సాధ్వతన్నున్గొంచు వే
బయలుల్ దేరును పోయివత్తునని యా ♦ పైయాజ్ఞఁ గొన్నాఁడవ
వ్యయ! శ్రీజమ్ములమడ్క పూర్వగవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 48

మ॥ ఫలముల్ భక్షణ జేతు నాజ్ఞ నిమ్మం ♦ బా! యంచు వేకోరుచున్
జలజాతాన్వితవృక్షయుక్త వనముల్ ♦ జక్కాడి వారించు కా
వలకాండ్రన్ వధియించి మించితివి శుం ♦ భత్శౌర్య! పాపాటవీ
జ్వలనా! జమ్ములమడ్క పూర్వగనివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 49

శా॥ రూఢిన్ వచ్చుచునున్న యక్షయకుమా ♦ రున్ జంపి సైన్యావళిన్
గాఢంబొప్పఁగఁ గూల్చి రావణుని వే ♦ కాంచన్ కరంబెంచియున్
రాఘారూఢిగ నేయు నింద్రజితు శ ♦ స్త్రజ్వాలకున్ వీడితౌ
ప్రౌఢిన్ జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 50

శా॥ ఆపై రావణుఁ జేర్చ నిన్నుగని రౌ ♦ ద్రాకారుఁడై క్రొంచి తా
కోపోద్దీపితుఁడై మహాకుటిలుఁడై ♦ కోదండఖడ్గంబులన్
నీపైఁ జూపఁగ రాఘవేంద్రు మహిమన్ ♦ వీక్షింతువాయన్న స
త్ప్రాపా! జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 51

మ॥ అకళంకాత్మ నినిన్నుఁ జూచి భటులా ♦ రా! యిప్పుడీకోతితో
కకు నిప్పున్ తగిలించుడంచనిన యా ♦ క్రూరాత్ములంటించ వీ
డక లంకాపురి గాల్చివేసితివి గా ♦ ఢంబొప్పగా సర్వర
క్షక! శ్రీజమ్ములమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 52

మ॥ మరలన్ సీతనుగాంచి మోదపడి అ ♦ మ్మా! ధీరుఁడౌ రాఘవే
శ్వరునిన్ జేరెద నాజ్ఞనిమ్మనుచును ♦ త్సాహంబుతో లేచి సా
గరముల్ దాటి ముదాన రాఘవుల వే ♦ గన్నాడవౌ యో కపీ
శ్వర శ్రీ జమ్ములమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 53

శా॥ ఈవృత్తాంతముఁ దెల్పి రాఘవులతో ♦ నేతెంచి వారాన్నిధిన్
వేవేగమ్మునదాటి రాక్షసులకున్ ♦ వెన్నివ్వకే పోరి నా
వా వాహా వైభవదీయశక్తి నెవరున్ ♦ వర్ణింపలేరయ్యా స
ద్భావా! జమ్ములమడ్క-పూర్ణిలయ దే♦వా! ఆంజనేయప్రభూ! 54

మ॥ గదచేదాలిచి రాక్షసప్రవరులన్ ♦ గంభీరతన్ గొట్టి నీ
పదసంఘట్టనచేత దానవతతిన్ ♦ పాతాళమున్ జేర్చి స
మ్మదమున్ గూర్చితి రాఘవేశ్వరులకున్ ♦ ముఖ్యంబుగా యో శుభ
ప్రద! శ్రీజమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 55

మ॥ తలలన్ గోయుచు సైన్యమున్ జెరచుచున్ ♦ దర్పించుచున్ గాఢ ని
శ్చలబాహాబల మొప్పగా తిరుగుచున్ ♦ శౌర్యానలంబున్ మహో
జ్వలతన్ లేపి విరోధిసైన్య వన వై♦శాల్యంబులన్ గాల్చితో
లలితా! జమ్ములమడ్క- భక్తపరిపా ♦ లా! ఆంజనేయప్రభూ॥ 56

శా॥ రక్తంబెల్లడఁ బారకాల్వలయి భీ ♦ రత్వంబునన్ రాక్షస
వ్యక్తుల్ కేకలుఁ బెట్టి పార తలలా ♦ హా గుట్టలై రాలగా
శక్తుల్ తద్రుధిరంబు త్రాగి యెగురన్ ♦ సర్వంబు మాపించితో
శక్తిన్ జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆ జనేయప్రభూ॥ 57

మ॥ తనుశక్త్యాయుధమేయ వెంట నెసుమి ♦ త్రాసూతిమూర్ఛిల్ల యా
తనిగొంపోవగ లేవ నెత్తునసురున్ ♦ ధైర్యంబుతో తన్ని క్రిం
దను బోర్లించితి వేమి నీమహిమ ♦ యుద్యత్శక్తి నీ దేకదా
యనఘా జమ్ములమడ్క-పూర్వర విహా♦ రా ఆంజనేయప్రభూ॥ 58

మ॥ అనుజుండాగతి మూర్ఛనంద సకటా! "హా"యంచు చింతిల్లియా
యిన వంశాగ్రణిదుఃఖమంద వడిగా ♦ నేతెంచియా జాంబవం
తుని వాక్యంబున నోషధిన్ వెదకగా ♦ ద్రోణాద్రికిన్ జేరి నా
వనఘా జమ్ములమడ్క-పూర్వరవిహా♦ రా! ఆంజనేయప్రభూ! 59

శా॥ కాసారంబున నీరుఁ ద్రాగఁ దిగ న ♦ క్రింబొందు నిన్ బట్టినా
హా సత్త్వమ్మున యుద్ధముం జలిపి దీ ♦ వ్యత్తేజముం జూపుచున్
నీసత్త్వంబున గర్భమంటఁ జొరియున్ ♦ వేధించితౌ సంస్కృతా
భ్యాసా! జమ్ములమడ్క-పూర్వవరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 60

శా॥ ఆనక్రింబును దున్మి దివ్యమతి దో ♦ స్త్రాగ్రిన్ విలోకించి యే
మైనన్నౌషధి కానరాని గిరినిన్ ♦ హస్తంబునన్ నిల్పి సూ
భానుం డుద్భవ మొందకున్ మునుపు ని ♦ వ్యాంబొప్పగా దెచ్చి యో
జ్ఞానా! జమ్ములమడ్క-మందిరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 61

మ॥ గిరిఁ గన్నంతనె సంతసంబొదవ నీ ♦ కేల్బట్టి రాముండు సు
స్థిరభక్తుండవు నీవనీ నెయనుచున్ ♦ శ్రీమీరఁ దీవించి స
ద్వరముల్ నీకునొసంగఁడే సుగుణుఁడా ♦ తమ్ముండు లేవన్ కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క-మందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 62

శా॥ ఆరాముండు దశాస్యునిన్ మరియు భృ ♦ త్యామాత్యులన్ గూడ సం
హారంబున్ బొనరించి సీతగనియో ♦ యజ్ఞాత్మిగో నేనునిన్
జేరన్ సందియమన్న నగ్నిబడ ని ♦ స్సీయంచు చింతించినా
వౌరా! జమ్ములమడ్క పూర్వవర విహా ♦ రా! ఆంజనేయప్రభూ! 63

మ॥ అనలుండా మహిజాత సీతఁగొని రా ♦ మా! సాధ్వి నీసీతఁ గో
మ్మన సంతోషముఁ జెంది కౌఁగిలిడవా ♦ హాయంచు స్వాంతంబునన్
పనియెల్లన్ నెరవేరెనంచు ననలున్ ♦ బల్మారు ప్రార్థించి వా
వనఘా! జమ్ములమడ్క-పూర్ణిలయదే ♦ వా! ఆంజనేయప్రభూ॥ 64

మ॥ పరమానందముతో విభీషణునకున్ ♦ పట్టంబుగట్టన్ మహా
కరుణన్ సాయము జేసి నీవనుపున వే ♦ డ్కన్ రామునిన్ లక్ష్మణున్
ధరణీ జాతను నిల్పి వారలనయో ♦ ధ్యన్ జేర్చినావో కపీ
శ్వర శ్రీ జమ్ములమడ్క-పూర్వవరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 65

మ॥ సుమవర్షంబులతోడ నిర్జరవరుల్ ♦ స్తోత్రింపశ్రీరామ నా
మముఁబౌరుల్ గొనియాడ భూపతులు సం ♦ ప్రార్థింప పట్టాభిషే
కముఁ జేయించుకొనంగ రాముఁడు మహా ♦ కారుణ్యుఁడైయిచ్చె పా
దములన్ జమ్ములమడ్క-మందిర!మహా ♦ త్మా!ఆంజనేయప్రభూ!66

మ॥ ఎటరాముండువసించునో రఘుకులుండె ♦ చ్చోటమాట్లాడునో
ఎటరామాయణముండునో యటకునీ ♦ వేతెంతు వెల్లప్పుడున్
బటుబాహాబలమొప్ప భక్తిగదురన్ ♦ ప్రార్థించుచున్ నిల్తువ
చ్చట శ్రీజమ్ములమడ్క- పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 67

శా॥ నీపాదంబులగొల్చుమాత్రమున నెం ♦ తేపుణ్యమబ్బున్ గదా
పాపంబెల్లనుపారిపోవును గదా ♦ బల్మోదమొప్పారను
ద్దీపించున్ గద విద్యలెల్లనుకృపా ♦ బ్ధీ! రామభక్తా! జన
ప్రాపా! జమ్ములమడ్క-పూర్వర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥68

శా॥ నీరూపంబును జూచినంతకనులన్ ♦ నీనామమాలించినన్
వారున్ భూతములెల్లభీతివడి నీ ♦ బాహాబలంబెన్న నె
వ్వారున్ జాలరు నేనుమాత్రమునినున్ ♦ వర్ణింపశక్తుండనే
ధీరా! జమ్ములమడ్క-మందిర కృపా ♦ బ్ధీ! ఆంజనేయప్రభూ! 69

శా॥ సంతానంబనినిన్ను జేరి సతమున్ ♦ సాధ్వీశిరోరత్నముల్
భ్రాంతిన్ నీకుప్రదక్షిణంబులిడుచున్ ♦ ప్రార్థించివేడంగ నా
కాంతల్సంతసమంద సంతతినివే ♦ డ్కన్ గూర్చినావయ్య సు
స్వాంతా! జమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ!70

మ॥ అనిజేయన్ గమనించుకాలమున క ♦ ళ్యాణంపువేళన్ వడిన్
ధనసంపాదనకేగునప్పుడెదనిన్ ♦ ధ్యానించినన్ సౌఖ్యమ
బ్బును సంపాదనగల్గుదేశములన ♦ భ్యుత్థానముల్ గల్గునో
యనఘా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 71

మ॥ నినుధ్యానించెడి భక్తులున్న స్థలము ♦ వీక్షించుమాత్రంబునే
కనులన్ జేసెడి పాపమెల్ల తొలగున్ ♦ గంభీరమై జన్మపా
వనమున్ గల్గెడి యేమినీమహిమచన్ ♦ పాలింపవే పాపసం
హననా! జమ్ములమడ్క- పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 72

మ॥ ఘనవేదాంతులమంచు చేయిపిడకన్ ♦ గంజాయిబుట్టన్ క్షణ
క్షణమున్ బీల్చుచు శిష్యులన్ బిలచి మోక్షంబిత్తుమాచాటుచున్
ధనధాన్యంబులసంగ్రహించెదరుగా ♦ దాకుక్షితుల్ గారె వా
రనఘా! జమ్ములమడ్క-మందిర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 73

మ॥ వినుతుల్ బొందుచునున్న మాత్రమున నే ♦ వేదాంతులైయ్యేందు రే
యనఘస్వాంతులమన్న మాత్రమున నా ♦ హా మోక్షమున్ గల్గునే
తనుతా నెవ్వరొ యోజనన్ జలుపుటే ♦ తత్వంబుగాదా మహా
స్వన శ్రీజమ్ములమడ్క-మందిర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 74

మ॥ పరిశుద్ధాత్మను బొందలేకను "నహం ♦ బ్రహ్మాస్మి" యన్నన్ మహా
గురుపట్టంబును గట్టుకొన్న సిసులన్ ♦ గూపెట్టిబోధించినన్
సరియా మోక్షము గల్గునే సతతమున్ ♦ సంస్తోత్రమున్ జేయ కే
స్థిర శ్రీజమ్ములమడ్క-మందిర! యశ ♦ శ్రీ! ఆంజనేయప్రభూ॥ 75

మ॥ అనఘాత్మా! రిపుశంకరాభరణ తా ♦ ర్క్ష్యా! భైరవీనాథ సం
జనితా! యాశ్రిత చక్రవాకరవితే ♦ జా! మోహనాకార! నీ
వనురాగాత్ముఁడవౌటనే నెఱిగి త ♦ య్యా! నమ్మితిన్ బ్రోవుమా
నను శ్రీజమ్ములమడ్క-వాస! కపిచం ♦ ద్రా! ఆంజనేయప్రభూ॥76

శా॥ ఆనందాంచిత! వాయునందన ప్లవం ♦ గాధీశ! సౌమ్యాంగ సు
జ్ఞానాత్మా! విజయధ్వజా! భవవినా ♦ శా! విక్రమ స్థైర్య! దే
వా! నిన్వర్ణనజేయవత్సరములౌ ♦ నాలోచనల్ జల్ప నా
కౌనా! జమ్ములమడ్క-పూర్వర విహా ♦ రా! ఆంజనేయప్రభూ! 77

శా|| ఆదిత్యప్రియశిష్యరో ప్లవగ సో ♦ మా! మంగళాకార! దే
వాదాక్షిణ్యకళాధర! బుధ! గురు ♦ ధ్యానాత్మ! పాప వల్లి
చ్ఛేదా నీశ్శుభ వారముఁ బిపి ర ♦ క్షింపంగదే నాపయి
న్వాదా జమ్ములమడ్క-వాస! కనరా ♦ వా! ఆంజనేయప్రభూ! 78

శా|| వీరా! పాపవిదూర! ధీర! సుకరా ♦ విశ్వాత్మ! యోద ష్ట సం
హారా! భక్తమనోవిహార! సుమ హా ♦ రా! సుందరాకార! యో
పారావార గభీర నన్ కరుణతో ♦ పాలింపుమయ్యా! సదా
చారా! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 79

శా|| చిత్రాచిత్ర చరిత్రపావన యశ ♦ శ్రీపాప జైత్రామహా
పాత్రా! భీకరయుక్తగాత్ర! కరుణా! ♦ పాథోనిధీయంజ నీ
పుత్రా! పాపమయాంధమిత్ర!వడిగా ♦ పోషింపుమా భక్త స
న్మిత్రా!జమ్ములమడ్క-పూర్నిలయ స్వా ♦ మీ!ఆంజనేయప్రభూ 80

శా|| ఈమాయాన్వితమా ప్రపంచమున తం ♦ డ్రీ!పుట్టియున్నాను నీ
ప్రేమన్గాంచ ప్రతిజ్ఞబూనితిని న ♦ న్వీక్షించి రక్షించవే
నీమాహాత్మ్యము నెన్నగానలవియే ♦ నిష్క-మ్య నిర్ధారణా!
స్వామీ! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆ జనేయప్రభూ||81

శా|| కామంబుఁ విదళించి నిశ్చలుడవై ♦ కైవల్యముఁ గోరి శ్రీ
రాముఁ సీతనుజేరి నేడఁగని పు ♦ త్రారమ్ము రమ్మంచు స
త్ప్రేమఁ వేదరహస్యముల్ దెలుపరే ♦ వేదాంతముఁ జూప రే
స్వామీ! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ!82

శా|| జంటఁ బాయక రామమూర్తిపద కం ♦ జాతంబులన్నమ్మి మూ
డింటిఁ ఖండనజేసి యాపయిన నై ♦ దింటఁ విదఁ గొట్టి యా
రింటిఁ ముట్టక యేడిటిఁ వదలి దీ ♦ వ్యేచ్ఛఁ గనఁ గోరి తొ
మ్మింటిన్ జమ్ములమడ్క-వాస!జితమ్మ ♦ త్మ్యాస్వ ఆంజనేయప్రభూ!83

శా॥ నేనే నీవను తత్త్వముం గనమనో ♦ నేత్రంబులన్విప్పి నీ
వానందంబునఁజూచి భ్రాంతివిడి మా ♦ యన్నింటియున్నాఁడ వ
జ్ఞానంబుద్దరిఁజేర నీయకయె సూ ♦ క్ష్మస్థాన దివ్యత్కళా
ధ్యానా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 84

మ॥ గురుడేశిష్యుఁడు శిష్యుఁడే గురునిగా ♦ గుర్తించి శ్రీరాముని౯
స్థిరచిత్తంబుననిల్పి పావనితతి౯ ♦ ఘోషించి సూక్తుల్ శ్రుతి౯
వరగన్వల్గితి వేమినీమహిమ నన్ ♦ బాలింపవే వానరే
శ్వర! శ్రీజమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 85

మ॥ మును కౌశల్ భవదీయభక్తిఁగని స ♦ మ్మోదంబు తో రాముద
ర్శనమిప్పింపుమన న్సుఖంబులను వ ♦ క్షచ్ఛేదమున్ జేసి వెం
టనెచూపించితి వెల్లరున్గొలువగా ♦ నాలోగలండంచునో
యనఘా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 86

మ॥ అనయంబున్ రఘురామమూర్తి కృపనీ ♦ యాత్మన్ వసించున్ గదా
వనజాతాక్షిని జానకిన్ గలసి ని ♦ న్వర్ణింపశక్యంబె నీ
ఘనకారుణ్యకటాక్షముల్ బరపిన ♦ న్గావంగదే యంజనీ
తనయా జమ్ములమడ్క-మందిర మహా ♦ త్మా! ఆంజనేయప్రభూ॥87

మ॥ మునుమైరావణుఁడా విభీషణుడనన్ ♦ మోసంబుతో వచ్చి రా
ముని సౌమిత్రినిఁగొంచు పోవగ బలం ♦ బున్ బెంచి పాతాళలం
కను తద్రాక్షసవర్యుఁగూల్చి కడువే ♦ డ్కన్ రాముమెప్పించితో
యనఘా! జమ్ములమడ్క-మందిర విహా ♦ రా! ఆంజనేయప్రభూ! 88

శా॥ ఆరోగ్యంబును లేక దీనులగు వా ♦ రత్యంతమౌభక్తితో
నీరూపంబుఁజూచుమాత్రమున తం ♦ డ్రి సౌఖ్యమున్ జెందరే
కారుణ్యాకర దీనచిత్తుడను నన్ ♦ న్గావంగదే యోసదా
ధారా! జమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ। 89

మ॥ ధనధాన్యంబులు లేవునాకనెడి చిం ♦ తన్ వీడుచున్నాను నీ
ఘనకారుణ్యముఁ గోరుకొంటినదియే ♦ కళ్యాణముల్ గూర్చు నా
కనుమానంబిసుమంత లేదు విడుమ ♦ య్యా నమ్మినిన్నిష్టభం
జన! శ్రీ జమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 90

మ॥ అకళంకాత్ముఁడ వీవునాహృదయమం ♦ దావాసమున్ జేయుమా!
సకలంబబ్బును నాకు నిత్యమును ని ♦ స్సందేహ మీమాట ని
న్నికనేఁ గోరున దేమి యున్నయది తం ♦ డ్రీ! సర్వలోకైక ర
క్షక! శ్రీ జమ్ములమడ్క-మందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 91

శా॥ శ్రీమంతుండగు జోగిరెడ్డియను దు ♦ ర్గంపూడి వంశ్యుండు నీ
ప్రేమన్గాంచదలంచి సిన్నిలిపె తం ♦ డ్రీ కోవెలన్ గట్టి స్వ
గ్రామంబందున భక్తుఁడౌటనుగదా ♦ కాపాడియున్నాడవో
స్వామీ! జమ్ములమడ్క పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ.92

మ॥ జనకుండాపనిజేయ పుత్రవరులున్ ♦ సంతోషయుక్తాత్ములున్
ఘనులౌ అయ్యపరెడ్డి జోగయమహా ♦ గంభీరమైగన్పడన్
పనియొప్పారగ సిల్పినారలుగదా ♦ ప్రాకారమావ్యాలనో -
యనఘా! జమ్ములమడ్క-పూర్వర విహా ♦ రా ఆంజనేయప్రభూ॥93

మ। అరయన్ గాదెకులుండు శ్రీహనుమ రె ♦ డ్డ్యాఖ్యుండు భక్తుండునీ
స్మరణన్ జేయుచు కాలమున్ గడిపిమా ♦ న్యంబిచ్చె గ్రామంబునన్
జనముల్ నేటికి భక్తి నీదగు పదా ♦ బ్జాతంబులన్ గొల్తురో
యనఘా! జమ్ములమడ్క- పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥94

మ॥ హరపుత్రాయ మహాబలాయ కపిసై ♦ న్యస్థాయ వీరాయ సం
గరభీమాయ కృపామయాయ త్రిజగ ♦ త్కళ్యాణ రూపాయ స
త్పరమాత్మాయ "నమోనమో"యనినచో ♦ పాపంబువిచ్ఛేదమా
ధరలో జమ్ములమడ్క-వాసహిత మో ♦ దా! ఆంజనేయప్రభూ॥ 95

మ॥ జయభక్తాంబుజ భాస్కరా! జయ మహా♦ శౌర్యానలప్రోజ్వలా!
జయ భూతాఖ్యగజేంద్రసింహా! జయవి♦ శ్వస్తుత్య! ధర్మాకరా!
జయ శ్రీరామపదాబ్జభృంగ! జయ భా♦ స్వద్బ్రహ్మచర్యవ్రతా!
జయశ్రీ జమ్మలమడ్క-పూర్వరవిహా♦ రా! ఆంజనేయప్రభూ! 96

మ॥ కరుణాసాగర! పాహిపాహి నతర♦ క్షా! పాహి శ్రీయంజనీ
తరుణీపుత్రక! పాహిపాహి భవజై♦ త్రా! పాహియో రామభూ
వర భక్తాగ్రణి! పాహిపాహి బుధ! భ♦ వ్యా పాహి దేవాకృపా
శరధీ జమ్మలమడ్క-పూర్వరనివా ♦ సా! ఆ జనేయప్రభూ॥ 97

మ॥ దిశభూతాశహిమాంశు సంఖ్యలను♦న ద్దీపించు శ్రీశాలివా[1858]
హ శకాబ్దంబున కర్మలోకనిధి చంద్రా♦ ఖ్యన్బ్రకాశించు[1936]
హాయాణశకాబ్దంబున ధాతవత్సరమునన్ ♦ చైత్రాదిం సంపూర్తి స
ద్యశ! శ్రీ జమ్మలమడ్క- పూర్వరవిహా♦రా ఆంజనేయప్రభూ॥98

మ॥ సతతంబెవ్వరు నీపదద్వయిని హ ♦ ర్షస్వాంతులై కొల్చి యీ
శతకంబున్బఠియింతురో కనుచునై ♦ శ్వైర్యంబులన్ గూర్చి వా
రతిమోదంబుననుండ జేయగద వ ♦ య్యా నీయశఃకాంతి శా
శ్వతమా జమ్మలమడ్క-మందిర నివా♦ సా! ఆంజనేయప్రభూ॥ 99

మ॥ నినుమున్నే నుతియించినానుగద తం ♦ డ్రీ! నావివాహంబు నీ
ఘనకారుణ్యముతోడ జేయుమని వే ♦ డ్కన్బ్రస్తుతుల్ జేరి యీ
పని జేయంగదె నమ్మియుంటినిక దే ♦ వా! భక్తకల్పద్రుమా !
అనఘా జమ్మలమడ్క-పూర్వర విహా♦ రా! ఆంజనేయప్రభూ! 100

మ॥ వరదా! మంగళ మూర్త్య! మంగళముదే♦ వా! మంగళంబో కపీ
శ్వర! వేదాంతవిచార! మంగళము ర ♦ క్షా! రామభక్తా! మ
హేశ్వర వీర్యోద్భవ! మంగళంబిదియె ♦ విశ్వస్తుత్యపాదా! దయా
శరధీ! జమ్మలమడ్క-పూర్వర నివా♦ సా! ఆంజనేయప్రభూ॥ 101

# శ్రీ ఆంజనేయస్వామి భజనకీర్తనలు.

కమాచి—రాగము

ఓ యాంజనేయ ప్రభూ! । పాహి! పాహి ॥ యో॥

అ॥ పయోంక నీపాదా । పద్మములనుదలతు
మాయారారోగ్యైశ్వ । ర్యాభివృద్ధిని జేయు॥ యోయా॥

(1) కరుణాసాగరధీవరా! భక్తాధారా । కలికల్మషసంహారా!
శరణాగతత్రాణ । బిరుదాంకితుడవని
నెరనమ్మినాము మా । దురితములణపుమ॥ హా॥ ఆ॥

(2) శరధినిదాటినావు లంకాపురి। జానకిగాంచినావు
తరయానె భవదీయ । చరితంబువర్ణింప
వరదా! రామభక్తా!। పరమపవిత్రాంగ॥ యో॥

(3) సంజీవితెచ్చినావు। రఘుకులుడైన। సౌమిత్రిని లేపినావు
రంజనహృదయ భవ । భంజన పరమాత్మ!
అంజనీదేవి గ। ర్భాంబుధి కళానిధి ॥ యో॥

(4) అన్నా యాశ్రితావత్సలా। నమ్మినవార। మన్నాయాశ్రితవత్సలా
కన్నెకంటి భద్రకవి నేలు। దేవామము
మన్నించు జమ్ములు। మడకమందిరవాస॥ శ్రీ॥

కీర్తన—కళ్యాణి.

వీరాంజనేయప్రభూ! పాహిపాహి ॥ వీ ॥

అ॥ పారావారాగభీర । పరమభక్తాధారా
శ్రీరామపదపద్మ । సేవాధురంధర

మి॥ శూరవర బ్రహ్మచర్యవ్రత । కూరహార నిఖిలాగమస్తుత
తారహారయశ ప్రభాసువి । చార లోకవిహారాధీరా॥ వీ ॥

(1) శరధినిలంఘించియు వేగమెలంకా । పురిజేరనూహించియు
సురలునీమహిమను । నరయసురసనుబంప
దరిజేరియామెను । దర్పమున మించుచును

మి॥ కరఘాతమున వేగలంకను । ధరణిపైబడజేసి ధరణిజ
వరసిలంకను గాల్చి రాక్షస । వరులనుగ్గాడినమహాత్మా॥ వీ ॥

(2) వడిగారాముని జేరియు । సంతసమొప్ప పడతివృత్తము దెల్పియు
కడువేడ్కవారిధి । గట్టి యందరిజేర్చి
దుడుకు రక్కసులను । దునిమి రాముని జేరి

మి॥ విడువకను కన్నెకంటికులుని । వీరభద్రియ నేలుచుండెడి
యొడయడా రారమ్ము జమ్ముల । మడకపూర్వరనిలయసదయా ॥ వీ॥

కీర్తన.

నరవరులారా కపి శేఖరుని । ఆంజనేయుపాద
సరసిజముల నాశ్రయించుడీ । సౌఖ్యములుగనుడి ॥ న ॥

అ॥ పరమపవిత్ర చరిత్రుడు భక్తాగ్రిణి । భవజైత్రుడు
వరదుడు నిశ్చలచిత్తుడు । కరుణాకరుడవ్యయుండు ॥ న ॥

(2) ఈతనినమ్మినవారికి యేమికొఅత । గలుగబోదు
పాతకముల పారద్రోలుగా । వెన్వెంటనిలచి
నీతిగలిగి రండూయుమ । దూతలకుగ జిక్కకుండు
యేతీరునమోక్షమార్గ । మెఱుగనగునో యోజింపుడు ॥ న॥

(3) కన్నెకంటివీరభద్రి । కవి నేలినపరమాత్ముడు
సన్నుతపాదుండుగాంచుడీ । మోక్షమునుగనుడి
క్రిన్నన యీతనిజేరిన గాని । పాపములుతొలంగ
వన్నలార యాపలుకు యం । దార్థమనుచు భావించుడు॥ న॥

శ్రీ వాయుపుత్రా! మహాసచ్చరిత్రా! బుధస్తోత్రపాత్రా! సుభక్తాత్మమిత్రా! మహాపాపదైత్యా! కృపాత్మాపవిత్రా. విశాలప్రనేత్రా! లసద్దివ్యగాత్రా! భవన్నామమెవ్వారు సేవింతురో త్వత్పదాబ్జాతముల్ మానసంబందునన్నిల్పి యెవ్వారుపాడెందురో వారలైశ్వర్య సంపన్నులై ధన్యులై మాన్యులై గణ్యులై వెల్గుచున్నారు పాపాళినిన్ దాటుచున్నారు వేదాంతభావంబు సాధించుచున్నారు మున్నర్కవంశాబ్ధి సోముండు రాముండు దేవేశుండు జానకీదేవినిన్ గూడి నీ భక్తికిన్ మెచ్చి తా స్వచ్ఛమై నిత్యమై సత్యమై వెల్గు ద్వైతాద్వైతాలోకింపగా జేయ ముద్యుండు రెంటిన్విచారింపుమా మూటినిన్ జంపుమా నాల్గిటిన్ మించుమా యైదిటిన్ బాధనంజేయుమా ఆరిటిన్ గొట్టుమా యేడిటిన్ పారిగన్ద్రోలుమా యెన్మిదింటిన్ కడన్ గొట్టుమా తొమ్మిదింటిన్ విసర్జించుమా! సాధ్యమౌనన్న వెన్వెంటనాయర్థముల్ మానసంబందునూహించి తత్త్వప్రకారంబులన్ జేసి యోగంబులన్ సాధనన్ జేసి శ్రీరామతత్త్వంబు సాధించి వాదించి నిష్కామ్యమై నిర్మలంబై ప్రకాశించునా తేజమున్ గాంచ యూహించినన్నో నేత్రము న్విచ్చి వీక్షించగా వెన్నసోమేడ గాన్పించు సన్నంపు దిడ్డిన్వడిన్ దూరగా వెన్నెలల్ గాయుచుండంగ తా కిన్నెరధ్వానముల్ జల్లుచున్నట్టి నారీశిరోరత్నమున్ గాంచి మోహించి భావించి మోహాబ్ధినిన్ దేలి యీలోకమున్నంటి యున్నంట కన్నంటియుండియున్ గానగారావుగా నిప్పించుచున్నాడవో భక్తవర్యక్రుపాధుర్య నిస్వర్ణనన్ జేయ నాసాధ్యమౌనయ్య యో బ్రహ్మచర్యవ్రతా నామొరాలించుమా నన్ను వీక్షించి నాకోరికన్ దీర్చుమా ఆంజనేయా మహాకాయ యీ దండకం బెవ్వరే వేళలన్ పాఠమున్జెట్టి వల్లింతురో వ్రాతురో చూతురో వారలీలోకసంబంధ సౌఖ్యంబులన్ బొంది పూర్ణాయురారోగ్య భాగ్యంబులన్ జెంది యంత్యంబునన్ శుద్ధమౌ జ్యోతినిన్ జూచి నీలోన నైక్యంబునున్ గాంతురో దేవ! దేవా! మహాభావ! సంపూర్ణకళ్యాణచారిత్ర శ్రీయంజనీపుత్ర! చిత్రప్రభావా! నమస్తే నమస్తే నమస్తే నమః.

మంగళమ్.